పిల్లల బొమ్మల

# సింద్‌బాద్ సాహసయాత్రలు

సంపాదకుడు

డి. చంద్రశేఖర్




SWATHI BOOK HOUSE

పిల్లల బొమ్మల

# సిందబాద్

## సాహసయాత్రలు

### విషయసూచిక...




సంపాదకుడు
**డి. చంద్రశేఖర్**

ప్రథమ ముద్రణ :
**ఏప్రియల్ - 2015**

ముఖచిత్రం, లోపలి బొమ్మలు
**చైతన్య**, విజయవాడ.

వెల: **60-00**

ISBN - 978-93-84812-22-5

టైప్ సెట్టింగ్ :
**శ్రీ సూర్యా గ్రాఫిక్స్**, విజయవాడ-2





28-22-20, రహిమాన్ వీధి,
అరండల్‌పేట, విజయవాడ-2.
ఫోన్ :0866-2432813,
సెల్ : **9848082432**



ప్రింటింగ్ :
**అరుణోదయా ఆఫ్‌సెట్**
విజయవాడ-2

# సింద్‌బాద్

## సాహస యాత్రలు

ఇరాక్ దేశంలోని ప్రముఖ పట్టణాలలో బాగ్దాద్ ఒకటి. ఆ పట్టణంలో హింద్‌బాద్ అనే నిరుపేద నివసిస్తూ ఉండేవాడు. ఒకరోజు హింద్‌బాద్ ఒక అందమైన, సువిశాల భవనం ముందునుంచి నడిచి వెళుతున్నాడు. ఆ భవనంలో నుంచి శ్రావ్యమైన సంగీతంతో పాటు నవ్వుల గలగలలు వినిపిస్తున్నాయి. ఆ ఇంట్లోని వారంతా ఏదో వేడుకలో నిమగ్నమై ఉన్నారు. హింద్‌బాద్ అక్కడ నుండి ఒక్క అడుగు ముందుకు వేయలేకపోయాడు.

తనలో తనే బిగ్గరగా మాట్లాడుకుంటున్నాడు.



"పొద్దుపొడిచింది మొదలు సాయంకాలం దాకా రెక్కలు ముక్కలు చేసుకున్నా కడుపునిండా తిండి దొరకటమే కష్టంగా వుంది. కాని ఈ భవనంలో నివశించే ధనవంతుడికి, పనీపాటా చేయకపోయినా రుచికరమైన ఆహారం ముప్పూటలా కావలసినంత దొరుకుతోంది. అతగాడు విలాసవంతమైన జీవితాన్ని హాయిగా గడిపేస్తోంటే నాకు మాత్రం కాయకష్టం తప్పడం లేదు, ఆకలీ తీరడం లేదు" అనుకుంటూ విచారంలో మునిగిపోయాడు.

ఆ మాటలు ఆ భవన యజమాని సింద్‌బాద్‌కు వినిపించాయి.



హింద్‌బాద్‌ను తన వద్దకు తీసుకురావలసిందిగా ఓ సేవకుణ్ణి పంపించాడు. సింద్‌బాద్ గొప్ప నావికుడు. ఎన్నో గొప్ప గొప్ప సాహసయాత్రలు చేశాడు. సింద్‌బాద్ కూర్చునివున్న విశాలమైన గదిలోకి హింద్‌బాద్‌ను తీసుకుని వచ్చాడు సేవకుడు. సింద్‌బాద్‌ను చూశాడు హింద్‌బాద్. సింద్‌బాద్ తెల్లని పొడవైన గడ్డం అతనికి బాగా నచ్చింది.

సింద్‌బాద్ అతనితో స్నేహపూర్వకంగా మాట్లాడాడు. ఈ రోజు రాత్రి తనతో కలసి భోజనం చేయవలసిందిగా కోరాడు. భోజనాల అనంతరం హింద్‌బాద్‌తో సింద్‌బాద్ ఇలా చెప్పాడు. "నేను చాలా కష్టపడి ఇంత ధనాన్ని సంపాదించాను. సముద్రయాత్రలలో ఎన్నో సాహసాలు చేసి ఇంతటి ధనవంతుడిని కాగలిగాను. ఒక్కొక్క యాత్రలో ఎన్నెన్నో అనుభవాలు... ఎన్నో కష్టనష్టాలు ఎదురయ్యాయి. అందులో ఏడు యాత్రలు అతి ముఖ్యమైనవి."




ఆసక్తిగా వుండటంతో హింద్‌బాద్, అతని స్నేహితులు కొందరితో కలిసి సింద్‌బాద్ ఎదురుగా కూర్చున్నాడు. సింద్‌బాద్ తన సాహస కథలను ఒకటొకటిగా వారికి చెప్పసాగాడు.

"ఇది నా మొదటి కథ" అంటూ సింద్‌బాద్ ప్రారంభించాడు. "నేను ఇరవై ఏళ్ల వయస్సులో ఉన్నప్పుడు దురదృష్టవశాత్తు తండ్రిని పోగొట్టుకున్నాను. ఆయన ద్వారా నాకు ఎక్కువ ఆస్తే సంక్రమించింది. తెలిసీ తెలియని వయస్సులో అంతా దుబారాగా ఖర్చు చేశాను. చివరకు నిరుపేదగా మిగిలాను. కొన్నాళ్లకు గాని తెలిసిరాలేదు. డబ్బు లేని మనిషి పశువుకన్నా హీనమని, అప్పుడు నా తండ్రి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి.

"డబ్బు సంపాదించాలంటే కష్టపడి పనిచేయాలి. ధైర్యంగా ముందడుగు వేయాలి." మా నాన్న చెప్పిన మాటలు నాలో కొత్త ఉత్సాహాన్ని నింపాయి. పోయినవి పోగా మిగిలినవాటిలో విలువైనవన్నీ అమ్మి వేశాను. ఆ సొమ్ముతో సముద్రయాత్రలో ఉపయోగపడే కొంత కిరాణా సామగ్రి కొనుగోలు చేశాను. వాటిని తీసుకొని కొంతమంది మిత్రులతో కలసి ఒక నౌక మీద సముద్రయాత్రకి బయలుదేరి వెళ్లాము. చాలారోజులు తరువాత ఒక దీవికి చేరుకున్నాము.

నిర్మానుష్యంగా ఉంది ఆ దీవి. ఒక్క చెట్టుగాని, పొదగాని లేవు. వేరే దీవికి వెళదామను కున్నాము. వెళ్లే లోపల ఆ దీవి ఒక్కసారి కంపించింది. కాళ్ల కింద

భూమి కదిలిపోతున్న అనుభూతి. మేమంతా భయాందోళనలకు గురయ్యాము. తోటివారంతా చకచకా నౌక ఎక్కేసి వెళ్లిపోయారు. నేనొక్కడినే అక్కడ మిగిలిపోయాను. నేను కూడా అక్కడ నుంచి పారిపోయేలోగా క్షణాల్లో ఆ దీవి ఒక్కసారిగా సముద్రజలాల్లో మునిగి పోయింది ! అప్పుడు అర్థమయ్యింది. అది దీవికాదని, అదో పెద్ద సముద్రపు చేప వీపు భాగమని.

బతుకుజీవుడా అని సముద్రజలాల్లో ఈదటం మొదలెట్టాను. అదృష్టవశాత్తు ఒక కొయ్య దుంగ చేతికందింది. దాన్ని ఆసరా చేసుకుని ఒక పగలూ ఒక రాత్రి అలా ఈదుతూనే ఉన్నాను. సముద్రపు అలలు నన్ను ఒక దీవికి చేర్చాయి. బాగా అలిసిపోయాను. అలసటతో ఇసుకతిన్నెలమీద అలాగే గాఢనిద్రలో మునిగిపోయాను. ఎప్పుడో మెలకువ వచ్చింది. లేచి చూడగా ఎదురుగా కొద్ది దూరంలో ఓ గుర్రం కనిపించింది. దాని దగ్గరకు వెళ్లాను. ఇంతలో కొందరు ఆగంతకులు వచ్చి నన్ను నిలదీశారు.

"ఎవరు నువ్వు ? ఎక్కడినుంచి వచ్చావు ? ఎందుకు వచ్చావు ?" గుక్క తిప్పుకోనివ్వకుండా ప్రశ్నల వర్షం కురిపించారు. వారికి నా వివరాలు అన్నీ చెప్పాను. ఇంతకూ మీరెవరని నెమ్మదిగా అడిగాను.

"మేము ఈ దేశపు రాజుగారి అశ్వికదళానికి చెందినవాళ్లం" గంభీరమైన గొంతుతో వారిలో ఒకని సమాధానం. వారికెందుకో నా కథ విని జాలి కలిగింది. ఆకలితో అలమటిస్తున్న నాకు ఆహార పానీయాలు ఇచ్చారు. రాజుగారైన మిహిర్‌జాన్ ఆస్థానానికి నన్ను తీసుకు వెళ్ళారు.

రాజుగారు కూడా చాలా మంచివాడు. నేను చెప్పిన విషయాలన్నిటిని సావధానంగా విని ఇలా అన్నారు. "సింద్‌బాద్!. నీవు చాలా ధైర్యశాలివి. నీవు కోరుకున్నంత కాలం మా ఆస్థానంలోనే వుండవచ్చు. నా అతిథిగా నీకు సకల రాచమర్యాదలు ఇక్కడ జరుగుతాయి".

సరేనన్నాను.

ఆ దేశపు ముఖ్యపట్టణం ఒక ఓడరేవు. ఖాళీ దొరికినప్పుడల్లా ఓడరేవుకు వెళ్లి అక్కడికి వచ్చే సముద్ర వ్యాపారులను కలసి ముచ్చటిస్తుండేవాడిని.

ఒకరోజు ఓ పెద్ద నౌక ఆ రేవుకు వచ్చింది. ఆ నౌకలోకి వెళ్లి చూడగా అక్కడ-మొదట నాతో కలసి బయలుదేరిన మిత్రుల సామగ్రి కనిపించింది. ఆ నౌక కెప్టెన్‌ను కలిశాను. అతడు నన్ను గుర్తుపట్టాడు. నేను సజీవంగా ఉన్నందుకు అతడు ఎంతో సంతోషించాడు. అది మేమంతా కలసి ప్రయాణం చేసిన నౌక అదేనని గ్రహించాను. అందులో నా సరుకులు, ఇతర సామగ్రి అంతా సురక్షితంగా ఉన్నాయి. అందులో కొన్ని విలువైన వస్తువుల్ని తీసుకువెళ్లి రాజా మిహిర్‌జాన్‌కు సమర్పించాను. అందుకు బదులుగా ఆయన నాకు కొన్ని బహుమతులు ఇచ్చారు. రాజుగారికి ధన్యవాదాలు తెలిపాను. అపురూపమైన వస్తువులు కొనుగోలు చేశాను. చాలా ధనంతో తిరిగి బాగ్దాద్ నగరానికి తిరిగొచ్చాను. ఇదీ నా మొదటి సాహసయాత్ర" అని వివరించాడు సింద్‌బాద్.

హింద్‌బాద్‌కు ఒక వంద బంగారు నాణేలు బహుమతిగా ఇచ్చాడు సింద్‌బాద్. అందుకు కృతజ్ఞతలు తెలిపి హింద్‌బాద్ తన ఇంటికి వెళ్లాడు.

# రెండో సాహసయాత్ర

మరుసటి రోజు హింద్‌బాద్ ఉత్సాహంగా సింద్‌బాద్ ఇంటికి వచ్చాడు. సింద్‌బాద్ అతడికి ఆత్మీయంగా ఆతిథ్యమిచ్చాడు. భోజనాలు పూర్తయ్యాక తన రెండో సాహసయాత్ర గురించి అతడికి వివరంగా చెప్పసాగాడు.

“మొదటి యాత్ర నుంచి తిరిగి వచ్చాక చాలారోజులు సంతోషంగా గడిపాను. ఆ యాత్రలో ఎదురయిన చేదు అనుభవాలు అన్నిటినీ పూర్తిగా మరిచిపోయాను. ఇక రెండోసారి సముద్రయాత్ర చేయాలని నిశ్చయించుకున్నాను.

పూర్వం మాదిరిగానే కొంత సామగ్రి, కొందరు స్నేహితులతో కలసి బాగ్దాద్ వదిలి నౌకపై ప్రయాణమై వెళ్లాం. కొన్ని రోజుల తరువాత ఒక దీవికి చేరుకున్నాం. అందరమూ కలసి ఆ దీవి అంతా తిరిగాం. ఆ ప్రాంతం నా మనసుకు బాగా నచ్చింది. అయితే ఇక్కడా మనుషులు ఎవరూ లేరు. చాలా రకాల ఫలవృక్షాలు కంటికి ఇంపుగా కనిపించాయి. మధుర ఫలాలను తిని ఆనందించాను.



నిద్ర ముంచుకొచ్చింది. ఓ చెట్టుకింద పడుకున్నాను. లేచి చూసేసరికి తన మిత్రులందరూ తను ఎక్కడున్నదీ తెలియక ఒంటరిగా వదిలేసి నౌక ఎక్కి వెళ్లిపోయారు. నాకు చాలా భయం వేసింది. ఓ పొడవైన చెట్టు పైకి ఎక్కి చుట్టూ గమనించాను. అల్లంతదూరాన ఇసుకతిన్నెలపై ఓ తెల్లటి పెద్ద ఆకారమేదో కనిపించింది. చెట్టుదిగి దాని దగ్గరకు వెళ్లాను. మెల్లగా దానిని తాకి చూశాను. మృదువుగా అనిపించింది. ఆ ఆకారం ఏమిటో తెలుసుకోవాలని ప్రయత్నించాను.

హఠాత్తుగా చీకట్లు కమ్ముకున్నాయి. ఆకాశంకేసి చూశాను. పైన మేఘాలు కూడా కనిపించలేదు. అంతలో పెద్ద రాకాసి పక్షి ఒకటి నావైపే రావడం గమనించాను. 'రాక్' అనే పక్షి గురించి గతంలో విన్నాను. ఆ రాకాసి పక్షి వచ్చి నా చెంతనే ఉన్న తెల్లని ఆకారంపై కూర్చుండిపోయింది. అప్పటికి గాని గ్రహించలేక పోయాను. అది ఆ రాకాసి పక్షి పెట్టిన గుడ్డు అని. రాకాసిపక్షి కాలు ఒకటి దాదాపు నాకు అతి సమీపంలో ఉంది. అది ఒక పెద్ద చెట్టు మొదలు అంత వుంది ! ఆ రాత్రంతా నాకు కంటిమీద కునుకు లేదు.

ఒకటే ఆలోచన - ఆ పక్షి సహాయంతో ఈ దీవి నుంచి వెళ్ళిపోవాలని. తెల్లవారగానే ఈ పక్షి కచ్చితంగా ఇక్కడ నుంచి ఎగిరిపోవడం ఖాయం. వెంటనే ఒక మెరుపు లాంటి ఆలోచన వచ్చింది. నా తలపాగ ఒక చివర ఆ పక్షి కాలికి గట్టిగా కట్టాను. రెండో చివర నా నడుముకు కట్టుకున్నాను. అనుకున్నట్లే ఆ రాకాసిపక్షి తెల తెలవారుతుండగానే పైకి ఎగిరిపోయింది. దానితోపాటు నేనూ గాలిలోకి ఎగిరాను. అమ్మో ! ఎంత వేగమో ! మేఘాలను తాకుతుందా అన్నట్లు అంత ఎత్తుకెగిరి శరవేగంగా దూసుకువెళుతోంది. నేను కళ్లు గట్టిగా మూసుకున్నాను.



నేను కళ్లు తెరచి చూసేసరికి ఆ పక్షి తన ఆహారమైన పాముల వేట కోసం ఒక లోయలో వాలింది. క్షణం కూడా వృథా చేయకుండా దాని కాలికి కట్టిన తలపాగా కొసను ఊడదీశాను. అది మాత్రం ఒక పామును కాలిగోళ్లతో పట్టుకుని ఎగిరిపోయింది. లోయంతా దట్టమైన పొదలూ ఎత్తైన చెట్లతో నిండి ఉంది. తీరా చూస్తే అది ఒక వజ్రాల రాసులు ఉన్న లోయ. ప్రపంచం నలుమూలల నుంచి వ్యాపారులు ఇక్కడకు చేరుకుని వజ్రాలను సంపాదించుకుని వెళుతుంటారు. కాసేపు ఆ ప్రాంతమంతా తిరిగాను. అనేక విలువైన వజ్రాలు కనిపించాయి.

పెద్ద పెద్ద పాములు వాటికి కాపలా కాస్తున్నాయా అన్నట్లున్నాయి. ఆ పాములు బుసకొట్టడం నాకు వినిపిస్తోంది. రాకాసి పక్షి అంటే ఆ పాములకు భయమని గమనించాను. అందుకే అవి బండరాళ్ళ మధ్యా, పొదలమాటునా దాగి ఉంటాయి. రాత్రి వేళల్లో మాత్రమే అవి బయటకు వచ్చి యదేచ్ఛగా తిరుగాడుతాయి. అక్కడి పాములు ఒక్కొక్కటి ఒక్కొక్క ఏనుగును అవలీలగా మింగివేయగలవు.

ఆ రాత్రంతా చాలా భయం భయంగా గడిపాను. ఒక గుహలో దాగి ప్రాణాలు ఎలాగో కాపాడుకున్నాను. రాత్రంతా ఆ పాములు బుసకొడుతూనే ఉన్నాయి.

తెల్లవారగానే గుహలో నుంచి బయటకు వచ్చాను. రాకాసి పక్షులు వచ్చి ఎత్తుకు పోతాయన్న భయంతో పాములు వాటి స్థావరాల్లోకెళ్లి దాక్కున్నాయి. అదే అదునుగా వజ్రాలు ఏరుకున్నాను. కొన్నిటిని జేబుల్లోను, మరికొన్ని సంచిలోను దాచుకున్నాను. ఇంతలో పెద్ద పెద్ద మాంసపు ముద్దలు నా చుట్టూ వున్న రాళ్లమీద పడి కిందకు దొర్లుతున్నాయి. ఆ మాంసపు ముద్దల్లోకి అక్కడి వజ్రాలు చొచ్చుకుపోవడం గమనించాను. పెద్ద పెద్ద దూడబాతులు దూసుకువచ్చి ఆ మాంసపు ముద్దలను నోటికి కరుచుకుని ఎగిరిపోతున్నాయి. వాటి స్థావరాల దగ్గరలో పొంచి వున్న వ్యాపారులు వాటిని తరిమేసి, మాంసపు ముద్దలో వున్న వజ్రాలను సొంతం చేసుకుంటున్నారు.

ఇంతలో ఓ పెద్ద మాంసపు ముద్ద నా కాళ్ల ముందు పడింది. ఈ లోయలో నుంచి ఎట్లా బయటపడాలా అని ఆలోచిస్తున్న నాకు ఒక మెరుపులాంటి ఆలోచన తట్టింది.

వజ్రాలు ఎక్కువగా అతుక్కుని వున్న ఒక మాంసపు ముద్ద చుట్టూ నా తలపాగా ఒక కొసను చుట్టి గట్టిగా కట్టాను. రెండో కొస నా నడుముకు చుట్టుకుని ముడివేశాను. కొద్దిసేపటికల్లా ఓ పెద్ద దూడబాతు రానే వచ్చింది. తలపాగ ఒక కొసకు కట్టి వున్న మాంసపు ముద్దను అది తీసుకుని ఎగిరిపోయింది. తలపాగ రెండో కొసకు నేను వేలాడుతున్నాను. మైదాన ప్రాంతంలోకి వెళ్లి వాలింది. వెనువెంటనే నేను మాంసపు ముద్దకు కట్టిన తలపాగా కొసను లాగేశాను.

అంతకుముందు ఆ మాంసం విసిరిన వ్యాపారులు నన్ను భయపెడుతూ నా వైపు పరుగెత్తుకొచ్చారు. నేను ఆ వజ్రాలను దొంగిలించడానికి వచ్చినట్లు వాళ్లు భ్రమపడ్డారు.

వాళ్లను వారించి నా కథను వినిపించాను. లోయలో నుంచి నేను తెచ్చిన విలువైన వజ్రాలను చూపించాను. వ్యాపారులు చాలా ఆనందపడ్డారు. వారి శిబిరానికి తీసుకొని వెళ్లి ఆహార పానీయాలు సమకూర్చారు. కొన్ని రోజులు వాళ్లతో సరదాగా గడిపాను. ఆ తరువాత ఆ వ్యాపారులతో కలసి ఒక నౌకాశ్రయానికి చేరుకున్నాను. అక్కడ నుంచి బాగ్దాద్‌కు క్షేమంగా తిరిగి వచ్చేశాను.

వజ్రాలను అమ్మి చాలా డబ్బు సంపాదించాను. అందులో చాలా భాగం నిరుపేదలకు అన్నదానం కోసం, ఇతర సంక్షేమ కార్యక్రమాల కోసం ఖర్చు చేశాను. నాకు మంచి పేరు ప్రఖ్యాతులు కూడా వచ్చాయి. ఇవీ నా రెండో సముద్రయాత్రా విశేషాలు" అని సింద్‌బాద్ ముగించాడు.

ఎప్పటిలాగానే హింద్‌బాద్‌కు నూరు బంగారు నాణేలు ఇచ్చాడు సింద్‌బాద్. మరునాడు వచ్చి మూడో సాహసయాత్ర గురించి వినవలసిందిగా ఆహ్వానించాడు. హింద్‌బాద్ ధన్యవాదాలు తెలిపి మిత్రులతో కలసి సెలవు తీసుకుని తన ఇంటికి వెళ్లిపోయాడు.

# మూడో సాహసయాత్ర

హిండ్‌బాద్ మరింత ఉత్సాహంగా మరునాటి రాత్రి వచ్చి సింద్‌బాద్‌ను కలిశాడు. కుశలప్రశ్నల అనంతరం సింద్‌బాద్ అతడికి మంచి భోజనం పెట్టించాడు. ఆ తరువాత తన మూడో సాహసయాత్ర విశేషాలను ఒక కథలా వినిపించసాగాడు.



"బాగ్దాద్‌లో చాలా రోజులు ఉన్నానని నిన్న చెప్పాను కదా ! ఏ పని చేయకుండా సోమరిపోతులా వుండటం నాకు నచ్చదు. అడ్డంకులు, కష్టాలు ఎదురైనా సముద్రయాత్ర చేయడానికే నేను బాగా ఇష్టపడతాను. వ్యాపార మిత్రులతో కలసి మరో యాత్రకు సమాయత్తమయ్యాను."

"అదృష్టవశాత్తు సముద్రం ఈసారి చాలా ప్రశాంతంగా వుంది. ఇది మాకు బాగా కలసివచ్చింది. ఎక్కువ దీవులకు వెళ్లగలిగాము. మంచి వ్యాపారం కూడా చేశాము." అని సింద్‌బాద్ సంతోషంగా చెబుతూ తన కథను కొనసాగించాడు.

"ఒక రోజు మా నౌక సముద్రం మధ్యలో ఉండగా పెనుతుఫాను చెలరేగి అలజడి సృష్టించింది. నౌక దారి తప్పింది. మాకు ఇష్టంలేకపోయినా తప్పనిసరిగా ఒక దీవికి చేరవలసి వచ్చింది. ఆ దీవి సముద్రపు దొంగలకు ప్రసిద్ధి అని మాకు ముందే తెలుసు. మేము అక్కడ దిగేందుకు లంగరు వేశామో లేదో దొంగల ముఠా ఒకటి మాపై దాడి చేసింది. వాళ్లంతా బాగా నల్లగా, దృఢంగా ఉన్నారు.



వాళ్లు చాలా కిరాతకులని తెలుసు. ఆ ముఠాలో వందల సంఖ్యలో ఆరితేరిన దొంగలు ఉన్నారు. మా నౌక లంగరును నాశనం చేశారు. ఏమి జరుగుతుందో తెలిసేలోగానే మేమున్న నౌకను వేరొక దీవి వైపునకు మళ్లించారు. మా సామగ్రి అంతా దోచుకుని వెళ్లిపోయారు. మేము నిస్సహాయంగా మిగిలిపోయాము."

కొంతసేపటి తరువాత మాలో కొందరికి ధైర్యం చెప్పి దీవిలో ఏమున్నాయో చూద్దామని తీసుకు వెళ్లాను. కొంత దూరం నడిచిన తరువాత చెట్లమధ్య విశాలమైన రాజభవనం వంటిది కనిపించింది. అక్కడ తినడానికి, తాగటానికి ఏమైనా దొరుకుతాయేమోనన్న ఆశ కలిగింది.

వడివడిగా అటుకేసి నడిచాం. ప్రవేశద్వారం వద్దనే ఓ పెద్ద ఎముకల గుట్ట మా కంటపడింది. అవన్నీ మనుషులవే ! ఇంతలో ఒక భయంకర ఆకారంలో వికృతంగా వున్న పొడవైన వ్యక్తి మా ముందు ప్రత్యక్షమయ్యాడు. అతడు ఆగ్రహావేశాలతో ఊగిపోతున్నాడు. అతడి నుదుట ఒకే ఒక కన్ను వుంది. అది కూడా అగ్నిగోళం మాదిరిగా వుంది. వికటాట్టహాసం చేస్తూ ముందుకు వంగాడు. మాలో ఒకరిని క్రూరంగా కాల్చి చంపి తినేశాడు. వెంటనే అతడు గుర్రుపెట్టి నిద్రలోకి జారుకున్నాడు. అతడి మీద ప్రతీకారం తీర్చుకోవడానికి అదే సమయమని నిశ్చయించుకున్నాం.

రాజ భవనంలోని ఒక గదిలో వెలిగించిన ఒక పొయ్యి, కొన్ని ఇనుప కడ్డీలను చూశాను. ఒక కడ్డీని బాగా ఎర్రగా ఆ పొయ్యి మీద కాల్చాను. దాన్ని తీసుకుని ఆ రాక్షసుడి కంట్లో ఒక్క పోటు పొడిచాను. అంతే కెవ్వున కేక వేశాడు. అతడికి ఇప్పుడు ఏమీ కనపడదు. ఉన్న ఒక్క కన్నూ పోయింది. మమ్మల్ని ఎలాగైనా పట్టుకోవాలని పెనుగులాడాడు. అతడి ప్రయత్నాలన్నీ వృథా అయ్యాయి. మేమంతా వెంటనే సముద్ర తీరానికి చేరుకున్నాం. మా నౌకలో ఎక్కి రెండురోజుల ప్రయాణం తరువాత మరో దీవికి చేరుకున్నాం.

బాగా అలిసిపోయాం. బడలిక వల్ల ఆదమరిచి ఆ ఇసుక తిన్నెల మీద నిద్రలోకి జారుకున్నాం. ఆ మరుసటి రోజు ఉదయం ఎక్కడైనా కాస్త తిండీ నీళ్లూ దొరుకుతాయేమోనని ప్రయత్నించాం.

తిండి దొరకలేదు సరికదా మాలో ఒకడు ఓ



పెద్ద కొండచిలువకు ఆహారమయ్యాడు.

ఆ కొండచిలువ తాటిచెట్టు ప్రమాణంలో వుంది. మాలో ఇక ఇద్దరమే మిగిలాము. నేను వెంటనే పెద్ద చెటుమీదకు ఎక్కేశాను. కిందకు చూద్దునుకదా మరో పెద్ద కొండచిలువ ఎటునుంచి వచ్చిందో మిగిలిన ఒక్క మిత్రుణ్ని మింగేసింది.

నేను ఒంటరివాణ్ణయ్యాను. ఆ రాత్రంతా ప్రాణ భయంతో ఆ చెట్టు మీదనే గడిపాను. పొద్దుపొడిచే వేళకు కొండచిలువలు రెండూ ఎటో వెళ్లిపోయాయి. చెట్టుమీదనుంచి మెల్లగా కిందికి దిగి సముద్రంవైపు నడిచాను. దూరంగా ఒక నౌక కనిపించింది. నా చేతి రుమాలును పైకెత్తి అటు ఇటు ఊపాను. ఎట్టకేలకు నా ప్రయత్నాలు ఫలించాయి.

నౌకలోని వాళ్లు నన్ను చూశారు. నేనున్న దిశగా ఆ నౌక కదిలిరావడం చూసి కేరింతలు కొట్టాను. నౌక మీదకు ఎక్కాను. నౌక కెప్తాన్, ఇతరులు నాకు సాదరంగా స్వాగతం పలికారు. ఆహారపానీయాలు అందించారు.

నౌక పైభాగంలో చూడగా అక్కడ నాపేరు వ్రాసివున్న అనేక పెట్టెలు, నిండుగావున్న సంచులు కనిపించాయి. అవన్నీ నేను నావెంట తెచ్చుకున్న కిరాణా సరుకులు. అప్పుడు నౌక కెప్తాన్ అన్నాడు.

"ప్రియ మిత్రమా ! మేము అప్పట్లో ఆ దీవిని వదలి వెంటనే వెళ్లిపోవాల్సివచ్చింది. నీ విషయం అందరమూ మరచి పోయాము. అక్కడ నుంచి వెళ్లిపోయిన చాలా సేపటికి నీవు మాతో రాని విషయాన్ని గమనించాము. వెనక్కు మరలి వచ్చే అవకాశం లేకపోయింది. అంటూ మిగిలిన సరుకులను, వాటిలో కొన్ని అమ్మగా వచ్చిన డబ్బును నాకు అందజేశాడు.

ఈ యాత్రలో కూడా నేను ఎక్కువ ధనమే సంపాదించాను. బాగ్దాద్ నగరానికి తిరిగి వచ్చాను. యథావిధిగా నా సంపాదనలో ఎక్కువభాగం దానధర్మాలకే ఉపయోగించాను. అలా ముగిసింది నా మూడో సాహసయాత్ర."

హింద్‌బాద్‌కు మరో నూరు బంగారు నాణాలు అందించి, అతడినీ అతడి మిత్రులను మరునాడు తన నాలుగో యాత్రా విశేషాలను వినడానికి రావలసిందిగా సింద్‌బాద్ ఆహ్వానించాడు.



# నాలుగో సాహసయాత్ర

హిండ్‌బాద్‌కు, అతని మిత్రులకు సాదరంగా స్వాగతం పలికాడు సింద్‌బాద్. గతాన్ని గుర్తు చేసుకుంటూ తన నాలుగో సాహసయాత్ర గురించి చెప్పనారంభించాడు.

"నా దగ్గర కావలసినంత ధనం  ఉంది. రేపు ఎట్లా గుడుస్తుందన్న చింతే లేదు. మూడోయాత్రలో ఎదురైన చేదు అనుభవాలను , పడిన కష్టాలను నిదానంగా మరిచిపోయాను. మళ్లీ మరికొన్ని చిల్లర సరుకులు కొనుగోలు చేసి నాలుగోసారి సముద్రయాత్రకి  బయలుదేరాను.



ఈసారి సముద్రం ఎందుకో అల్లకల్లోలంగా వుంది. కొంతదూరం నౌక మీద వెళ్లాక పెద్ద గాలివాన ఆరంభమయ్యింది. సముద్రంలో ఓ పెద్ద బండరాయిని మా నౌక ఢీకొంది.

నౌక తునాతునకలయ్యింది. నా మిత్రులలో చాలా మంది సముద్రంలో మునిగి చనిపోయారు. అదృష్టం కొద్దీ నాతోపాటు మరికొందరు ఆ నౌకలో విరిగిన పెద్దపెద్ద కొయ్యబల్లలూ, దుంగల సాయంతో ఈతకొట్టుకుంటూ రెండురోజుల తరువాత ఒడ్డుకు చేరుకున్నాము.

సముద్రతీరంలో ఇసుకతిన్నెలపై తిరుగుతుండగా దురదృష్టం మరోమారు వెన్నాడింది. నరమాంస భక్షకులు కొందరు మాపై దాడి చేశారు. వాళ్ల స్థావరాల వద్దకు బలవంతంగా తీసుకుని వెళ్లారు. కొన్ని మూలికలూ చెట్ల వేళ్ళూ మా ముఖానకొట్టి వాటిని తినాల్సిందేనన్నారు. మా మిత్రుడొకడు భయపడుతూనే తిని క్షణాల్లో

గాఢనిద్రలోకి జారుకున్నాడు. నేను ఆరుబయట ఒక రాయిపై కూర్చున్నాను. అంతే !

నరమాంసభక్షకుడు ఒకడు వడివడిగా వచ్చి నిద్రపోతున్న మిత్రుడ్ని అమాంతం నమిలి మింగేశాడు. అంత నిర్దయగా, జుగుప్సాకరంగా మనిషిని నిలువునా మింగేసిన అతడిని చూసి నేను భయపడ్డాను. వెంటనే అక్కడనుంచి పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నాను. అక్కడి తీరప్రాంత ప్రజలు నా కథ విని వారుండే దీవికి తీసుకువెళ్ళారు.

మరునాడు నన్ను వాళ్ల రాజుగారి దగ్గరికి తీసుకువెళ్లారు. ఆయన నా మీద ప్రేమతో "నీవు నా అతిథిగా మా అతఃపురంలో ఎంత కాలమైనా ఉండవచ్చు" అని చెప్పారు.

అప్పటి నుండి రాజుగారితోను, వారి మంత్రులూ, సలహాదారులతోనూ చాలా సన్నిహితంగా ఉన్నాను.

ఒకనాడు రాజుగారు గుర్రంపై వెళుతుండగా చూశాను. ఆ గుర్రానికి జీనుగాని, కళ్లెంగాని, కాళ్లకింద రికాబులుగాని లేకపోవడం గమనించాను. ఓ అందమైన జీను కుట్టాను. కళ్లెం, రికాబులు తయారుచేసి వాటిని రాజుగారికి బహూకరించాను. ఆయన చాలా సంతోషించారు. గుర్రపు స్వారీ మునపటి కంటే చాలా హాయిగా సుఖంగా వుందన్నారు. రాజాస్థానంలోని ఇతర ప్రముఖులు కూడా తమ గుర్రాలకు అలాంటివి తయారు చేసి ఇమ్మని కోరారు. అలా చాలా ధనం సంపాదించాను. రాజుగారి ఆస్థానంలో నేనే ప్రముఖ వ్యక్తిగా గుర్తింపు పొందాను.

ఒకనాడు రాజుగారు నాతో "సింద్‌బాద్ ! నీకో అందమైన అమ్మాయితో పెళ్లి జరిపించాలనుకుంటున్నా" అన్నారు.

అయితే పెళ్లి విషయంలో ముక్కూమొహం తెలియకుండా పరదేశి వనితను పెళ్లిచేసుకోవడం నాకిష్టం లేదు. అలా అని రాజుగారి మాటను కాదనే ధైర్యమూ లేదు. రాజుగారి ఇష్టప్రకారమే నా పెళ్లి వైభవంగా జరిపించారు. కొంతకాలం నాభార్యతో అక్కడే హాయిగా గడిపాను.

ఒకరోజు – మా పొరుగింటి గృహిణి హఠాత్తుగా చనిపోయిందన్న వార్త నాకు తెలిసింది. ఆమె భర్తను ఓదార్చేందుకు అక్కడికి వెళ్లాను. అతడు బిగ్గరగా ఏడుస్తూ "సింద్‌బాద్! ఇక ఈ భూమి మీద నాకూ నూకలు చెల్లినట్లే " అన్నాడు. ఆ దీవిలో ఓ వింత ఆచారం అమలులో వుందట. భర్త చనిపోతే భార్యను, భార్య చనిపోతే భర్తను కలిపి ఖననం చేస్తారట. ఇప్పుడు మా పొరుగింటి మిత్రుణ్ని మరికొద్ది గంటల్లో అతని భార్య శవంతోపాటు ఖననం చేస్తారు. వాళ్లిద్దరినీ కలిపి పూడ్చిపెట్టడం కళ్లారా చూసి భయపడి పోయాను.

అప్పటి నుంచి నాకు పిచ్చి పిచ్చి ఆలోచనలు రాసాగాయి. నా భార్య చనిపోతుందేమో! అదే జరిగితే ఇక నేను బాగ్దాద్ తిరిగి వెళ్లటం కల్ల.

అనుకున్నంతా అయ్యింది. ఉన్నట్టుండి నాభార్యకు జబ్బు చేసింది. చాలా ఖరీదైన వైద్యం ఆమెకు చేయించాను. ఫలితం లేకపోయింది. ఆమె చనిపోయింది....

నా భార్య తరఫున బంధువులు మిత్రులు నన్ను ఓదార్చేందుకు మా ఇంటికి వచ్చారు. రాజుగారితో ఆస్థానంలోని వారంతా తరలివచ్చారు. నాభార్య శవాన్ని ఆమెకున్న ఆభరణాలతో అలంకరించారు. రెండు శవపేటికలు తెప్పించారు. ఒకదానిలో నాభార్య శవాన్ని, రెండవదానిలో నన్ను పడుకోబెట్టారు. నా పక్కన ఏడు రొట్టెముక్కలూ, ఒక కుండ నిండా నీరూ వుంచారు. శ్మశాన వాటికకు తీసుకు వెళ్లారు.

అక్కడ నేలలో ఒక గుహ వుంది. దానిపైభాగాన బరువైన మూత అమర్చారు. మూత పక్కకు తొలగించి శవపేటికలు రెండింటిని ఆగుహలో ఉంచారు. మళ్లీ మూతను యథాస్థానంలో ఉంచి వెళ్లిపోయారు.

ఆ గుహలో ఎన్నో వజ్రవైఢూర్యాలు, ఆభరణాలు ఉన్నాయి. వాటిలో సాధ్యమైనన్ని తీసుకుని నా జేబుల్లో నింపుకున్నాను. శవపేటికలో నాతోపాటు వుంచిన ఏడు రొట్టెముక్కలు తింటూ ఏడురోజులు ఎలాగో గడిపాను. ఇకముందు ఆకలి ఎలా తీర్చుకోవాలన్నది పెద్దసమస్య.

హఠాత్తుగా జంతువు ఆకారంలో గల ఓ ప్రాణి నా పక్కన కనిపించింది. అది కదులుతోంది. దాన్ని అనుసరించి సముద్ర తీరానికి చేరుకున్నాను. అది సముద్ర జంతువు. అదే నా ప్రాణాలు కాపాడింది. ఏదైనా నౌక అటుగా వస్తుందేమోనని వేచి చూశాను. నౌక ఒకటి రానే వచ్చింది. ఆభరణాలతో సహా దానిపై ఎక్కి బాగ్దాద్ చేరుకున్నాను.

ఇవీ నా నాలుగో సాహసయాత్ర విశేషాలు. మీరు రేపు కనుక రాగలిగితే నేను చేసిన ఐదో సాహసయాత్ర గురించి చెబుతాను అంటూ సింద్‌బాద్ వారికి సాదరంగా వీడ్కోలు పలికాడు.



# ఐదో సాహసయాత్ర

ఆ మరునాడు సింద్‌బాద్ తన ఐదో సాహసయాత్రలో ఎదురైన ఘట్టాలను ఒకటొకటిగా వివరించసాగాడు. అప్పటికే నేను బాగా ధనాన్ని సంపాదించాను. స్వయంగా ఒక నౌకను కూడా కొనుగోలు చేశాను. ఏ పనీ చేయకుండా జీవితం గడపటం నాకు ఇష్టం ఉండదు. కొందరు వర్తకులతో కలసి ఐదోసారి సముద్రయాత్రకు బయలు దేరాను. సముద్రంలో చాలా దూరం ప్రయాణించి ఒక దీవికి చేరుకున్నాం. ఆకలి బాధలు తీర్చుకునేందుకు తిండి, నీరూ దొరుకుతుందేమోనని ఆ దీవి అంతా తిరిగాం. ఎక్కడా మనిషి జాడే కనపడలేదు. అంతా నిర్మానుష్యం.





ఒక చోట 'రాక్' పక్షి గుడ్డు చాలాపెద్దది కనిపించింది. నేను రెండో సాహసయాత్ర చేస్తున్న సమయంలో ఇటువంటి గుడ్డునే చూశాను. కనుక వెంటనే తెలుసుకోగలిగాను. రాక్ పక్షి గుడ్డును పొదిగి వుండటం వల్ల దాని పైపెంకు పగిలి పిల్ల బయటకు వస్తుండటం గమనించాను. నాతోటి మిత్రులలో కొందరు ఆ పిల్లను చంపి తిని తమ ఆకలి తీర్చుకున్నారు. క్షణాల్లో ఆ ప్రదేశమంతా చీకటి ఆవరించింది. ఆకాశం కేసి చూడగా ! పెద్ద రాక్ పక్షుల జంట రెక్కలు ఆడిస్తూ మేమున్న వైపే వస్తున్నాయి. వాటిని చూసి నేను చాలా భయపడిపోయాను.

తోటి మిత్రులతో "పారిపోండి! ఇక్కడ నుంచి వెంటనే పారిపోయి నౌకలోకి చేరుకోండి. రాక్ పక్షుల జంట మీరు చంపి తినేసిన పిల్ల తల్లిదండ్రులు. ప్రతీకారం తీర్చుకోవాలని మనవైపే కసిగా వస్తున్నాయి" అని బిగ్గరగా అరుస్తూ పరుగందుకున్నాను.

అలా పరుగెత్తి పరుగెత్తి నౌకలోకి వెళ్లి దాక్కున్నాము. గతంలో రాక్ పక్షుల పౌరుషం, వాటి బలమెంతో నాకు బాగా తెలుసు. అందుకనే చాలా భయమేసింది. ఏ నిమిషాన్నైనా అవి రెండు మా నౌక మీద దాడికి దిగవచ్చు. సాధ్యమైనంత తొందరగా అక్కడి నుంచి బయట పడాలని నిర్ణయించుకున్నాం.

ఇంతలో ఎక్కడ నుంచి వచ్చాయో తెలియదు. పెద్ద గుంపుగా రాక్ పక్షులు మా నౌక వైపే రావడం గమనించాను. పై ప్రాణాలు పైనే పోయినట్లనిపించింది. అవి వాటి కాళ్లతో పెద్ద పెద్దబండరాళ్లను మోసుకొస్తున్నాయి ! వాటి పసికూనను చంపినందుకు మాపై పగ తీర్చుకోవడానికే ఈ దాడి అని గ్రహించాను. మమ్మల్ని ఎలాగైనా చంపాలన్న కసితో ఆ బండరాళ్లను మా నౌకపై జార విడిచాయి. అంత ఎత్తునుండి పడుతున్న బండరాళ్ల బారి నుండి తప్పించుకోవడం అసాధ్యమనిపించింది. ఈ లోగా సముద్రపు కెరటాలు ఉవ్వెత్తున ఎగసిపడుతుండటం గమనించాం.

మా నౌక తునాతునకలయ్యింది. మేమంతా సముద్రంలోకి విసిరివేయబడ్డాం. అలా ఈదుకుంటూ ఈదుకుంటూ మరో దీవికి చేరుకోగలిగాము.

ఒళ్లు తెలియని అలసటతో కొంతసేపు అలాగే పడుకుని సేదదీరాం. ప్రాణం కుదుట పడాలంటే ఏదైనా తినాలనిపించింది. సముద్రతీరం వెంట చెట్టూచేమా చూడగా చూడగా తీయటి పండ్లు ఏవో దొరికాయి. వాటిని తిన్నాము.

ఒక వృద్ధుడు ఓ చెట్టుకింద కూర్చుని వున్నాడు. ఆయన దగ్గరకు వెళ్లి "ఎవరు మీరు ? ఇక్కడ ఎందుకు కూర్చున్నారు ?" అని అడిగాను. అతడు సైగ చేస్తూ తనను నా భుజాల మీదకు ఎక్కించుకుంటే కొన్ని పండ్లు కోసుకుంటానని చెప్పాడు.

అందుకు అంగీకరించాను. పండ్లు కోసుకున్నాడు. ఇక నా భుజాల మీద నుంచి దిగమని అడిగాను. దిగలేదు సరికదా నా మెడ గట్టిగా పట్టుకున్నాడు. ఏమి జరుగుతుందో తెలిసేలోగా నేను నేలమీద పడిపోయాను. అయినా అతడు వదలలేదు. బలవంతంగా నన్ను




మళ్లీ నిలబెట్టి
అతగాడు పండ్లు
కోసుకోనారంభించాడు. అతడిది
ఉడుంపట్టు. విడిపించుకోవడం సాధ్యపడలేదు.
రోజులు గడుస్తున్నాయి. ఇక ఉపేక్షించి లాభం
లేదనుకుని ఆ ముసలాణ్ణి ఎలాగైనా చంపివేయాలన్న నిర్ణయానికొచ్చాను.

ఒక ఆకు దోనెలో కొంత ద్రాక్షరసం పిండాను. అతనికి తెలియకుండ అందులో విషతుల్యమైన ఆకుపసరు కలిపాను. ఎక్కడలేని ప్రేమ ఒలకబోస్తూ అతగాణ్ణి ఆ ద్రాక్షరసం తాగమని ఇచ్చాను. తాగి అపస్మారక స్థితిలోకి వెళ్లాడు. అంతే ! ఒక్క ఉదుటున నేలకీడ్చి బలంగా ఒక బండరాయితో అతగాడి తలపై మోదాను. ఆ వృద్ధుడు చచ్చాన్రోయ్ ! అంటూ బాధతో కేకవేసి ప్రాణాలు వదిలాడు.

ఆ తరువాత సముద్రతీరానికి వెళ్లాను. అక్కడ ఒక నౌక ఉంది. ఆ నౌకలో ఉన్నవారికి నా దీనగాథను వివరించాను. అంతట వారు నాపై జాలిచూపారు. "నీవు చాలా అదృష్టవంతుడివి కనుకనే ఆ వృద్ధుడి చేతిలో చావు తప్పించుకోగలిగావు". అన్నారు.

ఆ నౌక కెప్టెను నన్ను వారితోపాటు మరో దీవికి తీసుకువెళ్లాడు. ఆ దీవిలో ఎక్కడ చూసినా కొబ్బరి చెట్లే కనిపించాయి. సాధ్యమైనన్ని కొబ్బరి బోండాలు సేకరించాలనుకున్నాను. తీరా సమీపించి చూస్తే ఆ చెట్లపై కోతులు గుంపులు గుంపులుగా ఉన్నాయి. కొంతమంది రాళ్లతో వాటిని తోలేందుకు ప్రయత్నిస్తున్నారు. అందుకు ప్రతిగా ఆ కోతులు కొబ్బరి బోండాలను వాళ్లపై విసరడం ఆరంభించాయి. అలా కిందపడిన కొబ్బరి బోండాలను దొరికినవి దొరికినట్టు వాళ్లు పోగుచేసుకుంటున్నారు. వాళ్లను అనుసరించి నేను కూడా వందల కొలది బోండాలను పోగుచేశాను. వాటిని నౌకాకేంద్రంలో అమ్మివేశాను. ఆ డబ్బుతో బాగ్దాద్ చేరుకున్నాను.

"ఇవీ నా ఐదో సాహసయాత్రలో ఎదురైన అనుభవాలు–" అంటూ సింద్‌బాద్ ముగించాడు. యథావిధిగా హింద్‌బాద్‌కు, అతని స్నేహితులకు రుచికరమైన భోజనాలు ఏర్పాటు చేశాడు. మళ్లీ మరుసటి రోజు రావలసిందిగా సింద్‌బాద్ వారందరినీ ఆహ్వానించాడు.



# ఆరో సాహస యాత్ర

ఒక ఏడాదిపాటు ఎంతో ఆనందంగా గడిపాను. కిరాణా సరుకులతో సహా కొందరు వర్తకులను కలుపుకుని ఆరోసారి సముద్రయాత్రకి బయలు దేరాను.

ఒకరోజు ఉన్నట్టుండి సముద్రం అల్లకల్లోలమయ్యింది. మా నౌక పెను తుపానులో చిక్కుకుపోయింది. నౌక కెప్తాను నా వద్దకు పరుగు పరుగున వచ్చి "మన నౌక సముద్రంలోని ఒక కొండను ఏ నిమిషంలోనైనా ఢీకొని తునాతునకలయ్యే అవకాశం ఉంది" అని హెచ్చరించాడు.

కొద్ది సేపటిలో అతడు ఊహించిందే నిజమయ్యింది. నౌక కొండను ఢీకొని ముక్కలయ్యింది. సముద్రంలో ఉవ్వెత్తున ఎగిసిన కెరటాల వాలుగా మేము ఎలాగో ప్రయాణించి ఒక దీవికి చేరుకున్నాం. అదృష్టవశాత్తు నాకు ఎటువంటి ప్రమాదమూ జరుగలేదు.

తీరప్రాంతమంతా పెద్దపెద్ద బండరాళ్లతో నిండివుంది. నేను ఆ రాళ్ల గుట్టలను దాటుకుంటూ కొండపైకి ఎక్కాను. అక్కడ విలువైన వజ్రాలు, కెంపులూ, మాణిక్యాలు కుప్పలు కుప్పలుగా పడివుండటం చూసి ఆశ్చర్యపోయాను. వాటిలో కొన్నిటిని తీసుకున్నాను. ఆ సమీపంలో ఒక గుహ వుంది. ఒక చిన్నయేరు ఆ గుహలో నుండి మైదానంలోకి పారుతోందని గ్రహించాను. గుహవెలుపల చిన్న చిన్న కొయ్యదుంగలతో చిన్న తెప్పను తయారు చేసుకున్నాను.

యేరు ప్రవహిస్తున్న దిశగా తెప్పను మెల్లగా నడుపుకుంటూ ముందుకు వెళ్లాను. గంటల తరబడి తెప్పలో ప్రయాణించాను. ఆ పరిసర ప్రాంతాల్లో కొందరు కూలీలు పొలాల్లో పని చేస్తూఉండటం గమనించాను. వారితో నా బాధలన్నీ చెప్పాను. నన్ను వారి నివాసప్రాంతానికి తీసుకువెళ్లారు.

ఆ మరునాడు వారి రాజుగారైన 'శరణదీపు'ని వద్దకు నన్ను తీసుకుని వెళ్లారు. నా సాహసాలను గురించి విని ఆయన చాలా ఆనంద పరవశులయ్యారు. రాజాస్థానంలో నన్ను అతిథిగా చాలా రోజులు గౌరవించారు. అందుకు బదులుగా నా వద్ద వున్న విలువైన వజ్రాలు, ఆభరణాలు రాజు గారికి కృతజ్ఞతా పూర్వకంగా అందజేశాను. వాటిని ఆయన తిరస్కరిస్తూ "మీరు మా అతిథులు. ఆతిథ్యమిచ్చేవారు మీ నుంచి ఎటువంటి కానుకలు స్వీకరించరాదు" అన్నారు. నా కోరిక మేరకు నా బాగ్దాద్ తిరుగుప్రయాణానికి ఒక నౌకను సమకూర్చారు. అనేక కానుకలతోపాటు బాగ్దాద్ కాలీఫ్ "హరుణ్ -అల్-రషీద్"కు అందించమని ఒక లేఖను నా ద్వారా పంపారు. బాగ్దాద్‌కు చేరుకోగానే నేను ఆ లేఖను, కొన్ని కానుకలను కాలీఫ్‌కు అందజేశాను.

"అలా నా ఆరో సముద్రయాత్ర ముగిసింది. మామూలుగా హింద్‌బాద్‌కు నూరు బంగారు నాణేలను బహూకరించాడు. అతన్ని, అతని మిత్రులను మరునాడు తన ఏడోదీ - చివరిదీ అయిన సముద్రయాత్ర విశేషాలను వినేందుకు రావలసిందిగా ఆహ్వానించాడు.



# ఏడో సాహస యాత్ర

మరికొన్నాళ్ల తరువాత నేను మరోసారి సముద్రయాత్ర చేయాలని నిశ్చయించుకున్నాను. ఆ దశలో కాలీఫ్ నన్ను పిలిపించారు. "సింద్‌బాద్! నాకు ఒక కోరిక వుంది. అది నీ ద్వారానే నెరవేరాలి. సెరిందాబాద్ రాజుగారికి మేము కొన్ని బహుమానాలు పంపించాలనుకున్నాం. నీవు వాటిని తీసుకుపోయి మా తరపున వారికి అందజేయాలి" అని కాలీఫ్ చెప్పారు.

అందుకుగాను ఒక పెద్ద నౌకను, కొందరు సేవకులను ఏర్పాటు చేశారు. కాలీఫ్ గారు ఇచ్చిన బహుమానాలు తీసుకుని బయలు దేరాను. సెరిందాబాద్ రాజుగారిని కలిసి కాలీఫ్ గారు ఇచ్చిన బహుమానాలను అందజేశాను. అందుకు వారు ఎంతో సంతోషించారు. అక్కడ చాలా రోజులు ఉండి వారి ఆతిథ్యాన్ని స్వీకరించాను. రాజుగారి వద్ద వీడ్కోలు తీసుకుని తిరుగు ప్రయాణమయ్యాను.

మార్గమధ్యంలో సముద్రపు దొంగలు మాపై దాడి చేశారు. వాళ్లు మమ్మల్ని పట్టుకొని అజ్ఞాత ప్రాంతానికి తీసుకువెళ్లారు. మమ్మల్ని బానిసలుగా కొందరికి అమ్మివేశారు. ఒక ఊరి పెత్తందారుకు నన్ను అప్పగించారు. ఆయన చాలా మంచి వ్యక్తి. మాటల మధ్యలో నాకు విలువిద్యలో ప్రవేశం ఉందని చెప్పాను.

ఒక రోజు నన్ను ఓ పెద్ద చెట్టు దగ్గరకు తీసుకువెళ్లి " ఈ చెట్టు చిటారు కొమ్మ పైకి ఎక్కి ఓ ఏనుగుల గుంపు ఇటుగా వస్తున్నాయేమో చూడు. వాటిలో ఒక దానిని గురి చూసి బాణంతో కొట్టు" అని ఆజ్ఞాపించాడు.

ఆయన చెప్పినట్టే చెట్టు ఎక్కి చిటారుకొమ్మకు చేరుకున్నాను. ఏనుగుల గుంపు కోసం ఎదురు చూశాను. రెండు రోజుల తరువాత ఓ ఏనుగుల గుంపు మావైపు రావడం గమనించాను. గురి చూసి బాణం వేశాను. ఏనుగు నేల కొరిగి ప్రాణాలు విడిచింది. గబగబ కిందికి వచ్చి నా యజమానికి ఆ విషయం చెప్పాను. ఇద్దరం కలసి ఆ ఏనుగు పడివున్న చోటికి వచ్చాము. ఆ ఏనుగు దంతాలను నా యజమాని నిమిషాల్లో ఊడబెరికాడు. నాకు ఆశ్చర్యం వేసింది. ఇంతలో ఆయన నా వైపు తిరిగి "సింద్‌బాద్ ! ఈ ఏనుగు దంతాలను అమ్మి చాలా డబ్బు సంపాదిస్తాను" అన్నాడు. అప్పుడప్పుడు ఆయన అలా ఏనుగులు చంపే పనిని నాకు అప్పగిస్తూనే ఉన్నాడు.

ఎప్పటిలాగే ఓ రోజు నేను ఓ చెట్టు చిటారుకొమ్మ మీదకు ఎక్కి ఏనుగుల గుంపు



రాకకోసం ఎదురు చూస్తున్నాను. కొంతసేపటి తరువాత ఏనుగుల గుంపు రానే వచ్చింది. అవన్నీ అతివేగంగా పరుగెడుతూ నేనెక్కిన చెట్టును చుట్టుముట్టాయి. వాటిలో ఓ పెద్ద ఏనుగు దాని దంతాలతో, తొండంతో నేను కూర్చుని ఉన్న చెట్టును బలంగా అటూ ఇటూ ఊపి చెట్టును పెకలించింది. నేను దభీమని నేలమీద పడ్డాను. ఆ ఏనుగు నన్ను అమాంతం తొండంతో ఎత్తి తన మెడ భాగంపై కూర్చోబెట్టుకుని.... వడివడిగా నడవటం ఆరంభించింది. మిగిలిన ఏనుగులు పెద్ద ఏనుగును అనుసరించాయి. ఓ కొండ వెనుకవైపునకు వెళ్లి అది నిలబడింది. అక్కడ నన్ను దింపివేసి నాకు ఏ విధమైన హాని తలపెట్టకుండా ఏనుగుల గుంపు వెళ్లిపోయింది. ఎదురుగా ఉన్న ఏనుగుల కళేబరాల వైపు, వాటి అవశేషాలవైపు చూశాను.

అవి నాతో ఇలా చెబుతున్నట్లు అనిపించింది. "అయ్యా ! మా దంతాలకోసం, ఎముకల కోసం మా జాతిని సర్వనాశనం చేయొద్దు. మీకు కావలసినన్ని దంతాలు, ఎముకలు మా శ్మశాన వాటికలో వున్నాయి." నా యజమానికి ఏనుగుల దంతాలు, ఎముకలు గుట్టలుగా పడివున్న విషయం తెలిపాను. మేము ఇద్దరమూ కలసి అక్కడికి వెళ్ళి వీలైనన్ని దంతాలను,

ఎముకలను తీసుకుని తిరుగు ప్రయాణమయ్యాము.

వాటినన్నింటిని అమ్మి నా యజమాని బాగా ధనాన్ని సంపాదించాడు. ఆ సందర్భంలో ఆయన నాతో మాట్లాడుతూ "సింద్‌బాద్ ! ఇక మీదట నీవు నా బానిసవు కాదు. నా సోదరసమానుడివి. ఇప్పటి నుంచి నీకు పూర్తి స్వేచ్ఛనిస్తున్నాను." అని అన్నాడు.




కొన్నాళ్ల తరువాత నా యజమాని ఇచ్చిన విలువైన ఏనుగు దంతాలతో బాగ్దాద్ వచ్చి వెంటనే కాలిఫాను కలిసాను. నా యాత్రలో ఎదురైన అనుభవాలను ఆయనకు వివరించాను. నా సముద్రయాత్రలు ఏడింటిలో ఎదురైన అనుభవాలను స్వర్ణాక్షరాలతో లిఖింపజేసి ఖజానాలో భవిష్యత్ తరాలకోసం భద్రపరిచారు అని వివరించాడు సింద్‌బాద్.

తన ఏడో సముద్రయాత్ర అనుభవాలను సావధానంగా విన్న హింద్‌బాద్‌కు, అతని మిత్రులకు మంచి విందు భోజనం ఏర్పాటు చేశాడు. హింద్‌బాద్‌కు మరో నూరు బంగారు నాణాలను బహూకరించాడు. హింద్‌బాద్ ఇంటికి తిరిగి వెళుతూ "సింద్‌బాద్ ! నీవొక గొప్ప నావికుడవు. నీ ధైర్యసాహసాలు మెచ్చదగినవి. నీవు సంపాదించిన పేరుకూ, ధనానికి నిజంగా అర్హుడవు. నీవు అందించిన కానుకలకు ధన్యవాదాలు" అని అన్నాడు.

# ముగ్గురు సోదరులు

అరేబియా దేశంలోని ఓ మారుమూల గ్రామంలో ఒక వృద్ధుడు నివసిస్తూ ఉండేవాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు. చాలా కష్టపడి అందరూ పనిచేసేవారు.



ఓ రోజు ఆ వృద్ధుడు తన ముగ్గురు కొడుకులను దగ్గరకు పిలిచి "నాయనలారా ! నాకు ముసలితనం వచ్చేసింది. మనకు వెనుక స్థిరాస్తులు ఏమీ లేవు. జీవితంలో మీరు మీ సొంత తెలివితేటలతో పైకి రావలసిందే. నాకు నమ్మకం ఉంది. మీరంతా స్వయం ప్రతిభతో తప్పక వృద్ధిలోకి వస్తారు ..." అని ఏదో చెబుతూనే వృద్ధుడు కన్నుమూశాడు.

ముగ్గురు కొడుకుల్లో అందరి కంటే పెద్దవాడు తన తమ్ముళ్లను పిలిచి. " తమ్ముళ్లూ ! నాన్నగారు చెప్పిన మాటలు గుర్తున్నాయి కదా. మనం మన సొంత తెలివితేటలతో ప్రతిభతో జీవితంలో ఉన్నతస్థితికి రావాలి. ఇక్కడ సరైన పనులు లేవు. మనం ముగ్గురం బాగ్దాద్ నగరానికి పోదాం. అక్కడ మన అదృష్టాన్ని పరీక్షించుకుందాం. ఏమంటారు ?" అని అడిగాడు. తమ్ముళ్లు ఇద్దరూ అన్నయ్య మాటకు అంగీకారం తెలిపారు. ముగ్గురూ కలిసి ఎడారిలో చాలా దూరం ప్రయాణం చేస్తూ వున్నారు. పెద్దవాడు ఆ ఇసుకలో ఏదో గమనించి "తమ్ముళ్లూ ! కొంతసేపటి క్రితం ఇటుగా ఒక ఒంటె నడిచి వెళ్లింది. ఇవిగో దాని అడుగుజాడలు" అంటూ తమ్ముళ్లకు చూపించాడు.

రెండో తమ్ముడు ఆ అడుగులను నిశితంగా గమనిస్తూ "ఆ ఒంటెకు ఒక్క కన్నేవుంది" అన్నాడు. మరి కొంత దూరం వాళ్లు ముగ్గురూ ఆ ఒంటె వెళ్లిన దిక్కుగా నడిచారు. ఇంతలో మూడోవాడు నేలమీద ఏదో చూస్తూ " ఆ ఒంటె మీద ఒక స్త్రీ, మరో పిల్లవాడు వున్నారు. అని అన్నాడు. ఇంతలో ఒక వ్యక్తి గుర్రం మీద స్వారీ చేస్తూ వచ్చి వాళ్ల సమీపంలో గుర్రాన్ని ఆపాడు. పెద్దవాడు ఆ వ్యక్తిని ఉద్దేశించి మాట్లాడుతూ "అయ్యా ! మీరు దేనికోసమో వెతుకుతున్నట్లున్నారు" అని అడిగాడు. "అవును "నేను ఓ ఒంటె కోసం వెతుకుతున్నాను" అన్నాడా అపరిచితవ్యక్తి.

"ఒంటెకోసమా ?" మళ్లీ రెట్టించి అడిగాడు పెద్దవాడు.

" అవును"

" దాని ఎడమ కన్ను గుడ్డిది. అవునా ?"

"అవును" ఉద్వేగంగా అన్నాడు అపరిచితుడు.

"ఆ ఒంటె మీద ఒక స్త్రీమూర్తి, మరో పిల్లవాడు ఉన్నారు కదూ !" అన్నాడు మూడోవాడు.

ఆ అపరిచిత వ్యక్తికి వీళ్లు చెబుతున్నది వింటుంటే ఏదో అనుమానం వచ్చింది. "ఇప్పుడు నాకు అర్థమవుతోంది. మీరు ముగ్గురే నా భార్యాబిడ్డలను, ఒంటెను దొంగిలించారు.

నిజం చెప్పండి. నా భార్యాబిడ్డలను ఎక్కడ దాచారు ?" అని గద్దించి అడిగాడు.

"అయ్యా ! మీరు పొరపడుతున్నట్లున్నారు. అసలు మేము ఏ ఒంటెనూ చూడలేదు." అన్నదమ్ములు ముగ్గురూ ముక్తకంఠంతో వినయంగా చెప్పారు.



"మరి మీరు నా ఒంటె గురించిన వివరాలు అంత కచ్చితంగా ఎలా చెప్పగలిగారు ?" నిలదీశాడు గుర్రం మీదవున్న వ్యక్తి.

"మన కంటి చూపునకు తెలివితేటలను జోడిస్తే తెలుసుకోలేనిది ఏమీ లేదు. మరి కొంచెం ముందుకు వెళదాం. మీకు ఒంటెతోపాటు మీ భార్యాబిడ్డలు కూడా దొరుకుతారు. అని వారు హామీ ఇచ్చారు. "నేనేమన్నా మూర్ఖుడిననుకున్నారా మీరు చెప్పినదల్లా నమ్మడానికి ?" అంటూనే తన దగ్గరున్న పొడవైన కత్తిని ఝుళిపించాడు.

"మర్యాదగా నేను చెప్పినట్టు చేయండి". వాళ్ల ముగ్గురిని తమ దేశపు పాదుషాగారి ఆస్థానానికి తీసుకు వెళుతూ "న్యాయమేమిటో ఆయనే చెబుతారు" అని వారిని పాదుషా దగ్గరకు తీసుకువెళ్లాడు.

"వీళ్ల ముగ్గురిపైన నీ అభియోగం ఏమిటి ?" సుల్తాన్ ప్రశ్నించాడు.

గుర్రం మీద వచ్చిన వ్యక్తి భోరుభోరున ఏడుస్తూ "నేను పొలంలో ఆవుల మందను మేపుకుంటూ వెళుతున్నా. నా భార్యాబిడ్డలు ఒంటె మీద నా వెనుకే వస్తున్నారు. ఇంతలో ఆ ఒంటె దారి తప్పింది. వెదుక్కుంటూ వెళుతుండగా ఈ ముగ్గురు అన్నదమ్ములు తారసపడ్డారు. ఒంటె ఏదైనా కనపడిందా ? అని అడిగాను. వాళ్ళు నా ఒంటె ఆనవాళ్లు సరిగ్గా చెప్పారు. అంతేకాదు ఆ ఒంటె మీద ఒక స్త్రీ, ఒక పిల్లవాడు ఉన్నారని కూడా చెప్పారు. నిలదీసి అడిగితే అసలు మేము ఒంటెనే చూడలేదని బుకాయిస్తున్నారు. అబద్ధాలు చెబుతున్నారు. దయగల ప్రభువులు తమరే నాకు న్యాయం చేకూర్చాలి. నా భార్యాబిడ్డలు, ఒంటె ఎక్కడ వున్నదీ వీళ్లచేత నిజం చెప్పించాలి" అని వేడుకున్నాడు.

సుల్తాన్ వాళ్లను విచారించాడు. "దొరవారు కరుణించాలి. మేము నిజంగా అమాయకులం. మేము అసలు ఒంటెనే చూడలేదు. అయితే మా తెలివితేటలు ఉపయోగించి మేము ఆ ఒంటె, తల్లీబిడ్డల గురించి అంచనా వేయగలిగాము. కళ్ళు చూసినదాన్ని మేథస్సుతో నిశితంగా ఆలోచిస్తే మనచుట్టూ ఏమి జరుగుతున్నదో ఇట్టే అంచనా వేయవచ్చు" అని ఆ



ముగ్గురూ చెప్పారు. సుల్తాన్ వారు చెప్పినది సావధానంగా విని "మీ శక్తియుక్తులను గురించి ఇంకా వివరంగా తెలుసుకునేందుకు నేనో చిన్న పరీక్ష పెడతాను" అని అన్నాడు.

వెనువెంటనే వజీరును రమ్మనమని కబురు పంపారు. వజీరు రాగానే సుల్తాన్ అతడి చెవిలో ఏదో గుసగుసలాడాడు. వజీరు తల ఊపుకుంటూ బయటకు వెళ్లి కొంచెంసేపటి తరువాత తిరిగి వచ్చాడు. ఈలోగా ఇద్దరు సేవకులు ఒక పెట్టె తీసుకువచ్చారు. సుల్తాన్‌గారి సమక్షంలో ఉంచి వెళ్లిపోయారు.

"యువకులారా ! ఇప్పుడు చెప్పండి. ఆ పెట్టెలో ఏముంది ?" సుల్తాన్ ప్రశ్నించాడు.

అందరికంటే ముందు పెద్దవాడు ముందుకొచ్చి "ఈ పెట్టెలో ఉన్నది ఓ గుండ్రటి వస్తువు అయిఉండాలి" అన్నాడు నవ్వుతూ.

రెండోవాడు ముందుకువచ్చి "బహుశా అది దానిమ్మపండు అయి వుండవచ్చు" అన్నాడు.

మూడోవాడు జోక్యం చేసుకుంటూ "ఇంకా ఆ దానిమ్మపండు పక్వానికి రాలేదనుకుంటా" అన్నాడు.

సుల్తాన్ ఆ పెట్టెను తెరువవలసిందిగా ఆదేశించారు. అంతే ! అందరూ అబ్బురపడే విధంగా అందులో ఇంకా పక్వానికి రాని దానిమ్మపండే ఉంది !

అప్పుడు సుల్తాన్ చప్పట్లు చరుస్తూ "ఈ ముగ్గురు అన్నదమ్ములు నిర్దోషులు. వీళ్లకు గొప్ప వినికిడిశక్తి ఉంది" అంటూ ప్రశంసల వర్షం కురిపించాడు. గుర్రం మీద వచ్చిన వ్యక్తిని ఉద్దేశిస్తూ ఇక నీవు వెళ్లి నీ భార్యా బిడ్డల కోసం, నీ ఒంటెకోసం వెతుక్కో" అని సుల్తాన్ ఆజ్ఞాపించాడు.

ఆ ముగ్గురు అన్నదమ్ములకు విందు ఏర్పాటు చేశాడు సుల్తాన్. ఎడారిలో ప్రయాణిస్తున్నవారినీ, ఒంటె ఆనవాళ్లను, ఎలా పసిగట్టగలిగారో తెలుసుకోవాలని సుల్తాన్ ఆసక్తి వ్యక్తం చేశారు.

పెద్దవాడు చెబుతూ "నేను ఎడారి ఇసుక తిన్నెల మీద ఒంటె అడుగుజాడలను బట్టి



ఓ పెద్ద ఒంటె అటుగా వెళ్లినట్లు గుర్తించగలిగాను" అన్నాడు. సుల్తాన్ జోక్యం చేసుకుంటూ "అంతవరకూ బాగానే వుంది. మరి ఆ ఒంటె ఒక కన్ను గుడ్డిది అని ఎలా తెలుసుకో గలిగావ్ ?

అన్నదమ్ముల్లో రెండోవాడు సమాధానమిస్తూ "ఆ ఒంటె దాని కుడివైపున వున్న చెట్లను, మాత్రమే కొరికి తిన్నదని గమనించాను. అందువలన దాని ఎడమ కంటికి దృష్టిలోపం ఉందని గ్రహించాను". "ఇదీ బాగానే ఉంది. మరి ఆ ఒంటె మీద ఓ మహిళ, పిల్లవాడూ ఉన్న విషయాన్ని ఎలా ఊహించారు ?" అని మరింత ఉత్సాహంతో సుల్తాన్ ప్రశ్నించారు.

అయ్యా ! ఒక చోట ఒంటె తన ముందు కాళ్లమీద బాగా కిందకు వంగిన జాడ కనుగొన్నాను. ఆ పక్కనే ఒక మహిళ, మరో పిల్లవాడి పాదాల ముద్రలు ఉండటం గమనించాను" అని మూడోవాడు వివరించాడు. సుల్తాన్ వారిని ప్రశంసలతో ముంచెత్తుతూ "మా ఆస్థానంలో మేము తెప్పించిన పెట్టెలో దానిమ్మపండు ఉన్న విషయాన్ని ఎలా అంచనా వేయగలిగారు ?" అని ప్రశ్నించారు.

"అయ్యా ! మీ సేవకులు ఆ పెట్టెను చాలా తేలికగా తీసుకొచ్చారు. దానిని బట్టి అందులో బరువైన వస్తువేదీ లేదని గ్రహించాం. ఆ పెట్టెను కిందకు దింపుతున్నపుడు ఏదో గుండ్రని వస్తువు దొర్లుతున్న శబ్దాన్ని విన్నాం. కనుక బంతిలాంటి వస్తువేదో లోపల వుందని గ్రహించాం. కిటికీ నుంచి బయటకు చూడగా అక్కడ దానిమ్మతోట వుంది. అటునుంచే తమ సేవకులు ఆ పెట్టెను తెచ్చారు కదా ! దాంతో ఇందులో వున్నది కచ్చితంగా దానిమ్మపండేనని అంచనా వేయగలిగాం.

"ఆ పండు ఇంకా పక్వానికి రాని విషయాన్ని ఎలా పసిగట్టారు ?" సుల్తాన్ ప్రశ్నించారు.

"ఇది చాలా సులభం సుల్తాన్ జీ ! దానిమ్మపండ్లు పంటకొచ్చే ఋతువు ఇంకా ఆరంభం కాలేదు కదా ! కనుక పండ్లు పక్వానికి వచ్చే ప్రశ్నే లేదు" అని యువకులు ధైర్యంగా చెప్పారు.

సుల్తాన్ ఆనందానికి అవధులు లేవు. తన ఆస్థానంలోనే సలహాదారులుగా ఉండాల్సిందిగా ముగ్గురు సోదరులను సుల్తాన్ కోరారు. చాలా సంతోషంగా వారందుకు అంగీకరించారు. బాగ్దాద్ సుల్తాన్ ఆస్థానంలో ఆ ముగ్గురు సోదరులు అవసరమైనప్పుడల్లా సుల్తాన్‌కు సలహాలు, సూచనలు అందిస్తూ జీతభత్యాలతోపాటు ప్రభువులిచ్చే బహుమానాలతో వారు విలాసవంతమైన, సుఖప్రదమైన జీవితాన్ని గడపసాగారు.

